### స్నేహదగ్ధచికిత్స

**స్నేహదగ్ధే భృశతరం రూక్షం తత్ర తు యోజయేత్.**

స్నేహదగ్ధములో మిక్కుటముగా రూక్షకరమైన యౌషధములను ప్రయోగింపవలయును. (తు) అనుశబ్దమువలన తఱుచుగా రూక్షకరమైన ప్రలేపాదులను, దేశము, కాలము, సాత్మ్యము వీని కనుగుణముగా నాయా యవస్థకుతగినటుల స్నిగ్ధౌషధాదులను విధిప్రకారము ప్రయోగింపవలయునని యర్థం బగుచున్నది.

### సూత్రస్థాననిగమనము

**సమాప్యతే స్థానమిదం హృదయస్య రహస్యవత్,**

హృదయమువలె నతిరహస్యార్థములంగల అష్టాంగహృదయ మను నీతంత్రము యొక్క సూత్రస్థానము ముగింపబడుచున్నది.

**అత్రార్థాసూత్రితాసూక్ష్మాః ప్రతన్యంతే హి సర్వతః.**

ఈ స్థానమునం దతిసూక్ష్మబుద్ధిగలవారలచే నెఱుంగదగిన యర్థములు సూచింపబడి చెప్పబడియున్నవి. ఈయర్థములే సమస్తతంత్రములయందు విస్తరింపబడెను.

త్రింశాధ్యాయము ముగిసెను.

---

ఇతి శ్రీ వైద్యపతి సింహగుప్తసూను వాగ్భట
విరచితాయాం అష్టాంగహృదయసంహితాయాం
ఆంధ్రతాత్పర్యసహితాయాం
ప్రథమం సూత్రస్థానం
సంపూర్ణమ్



---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1948.